శుభమస్తు

# మహర్నవమి పద్యములు

శ్రీహరికరుణాకటాక్ష । భూషణాలంకార। అర్థి జనకుముదచంద్రోదయ। ఆశ్రితవిద్వజ్జనాధార । సత్య భాష హరిశ్చంద్ర । సంగీత విద్యావిశారద । సాహిత్య విద్యాచతుర్ముఖ । దానరాధేయ । సంగ్రామధనంజ య । సాహస విక్రమార్క । చతుస్సభా కంఠీరవా॥ జయా విజయీభవ। దిగ్విజయీభవ ॥

ధరసింహాసనమై । నభంబుగొడుగై । తద్దేవ తల్ భృత్యులై । పరమామ్నాయము లెల్ల వందిగణ మై । బ్రహ్మాండమాకారమై । సిరిభార్యామణియై । విరించికొడుకై । శ్రీగంగ సత్పుత్రియై వరుసన్నీఘన రాజసంబునిజమై । వర్ధిల్లు నారాయణా ॥ జ ॥ ది ॥

శ్రీజగన్నాయక శ్రీరంగనాథ । శ్రీవేంకటే శ్వరా । శ్రీరామచంద్ర । శ్రీకృష్ణమాధవా శ్రీనా రసింహా । శ్రీధరగోవింద శ్రీహృషీకేశ । పద్మనా భాచ్యుతా పరమాత్మశౌరి । హరికైటభాసంవముర దైత్యరమణ । దేవకీనందనా దివిజేంద్రవినుత । వాసిక సుతపాద వరకోమలీల । శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గపాణి

హాస్త । భక్తసంరక్షణా పాండవవత్స । నీభక్తులము మేము నిన్ను నమ్మితిమి । మాయయ్యా వారినిమమ్ము రక్షించు । పెద్దాపురంబులో పెరుగుచున్నట్టి । వెంకటేశ్వర వినాకువెయ్యదండములు ॥ జ ॥ ది ॥

నందివాహనవిమల నాగకేయూర । బృందారకాదిమునిపూజితవిహార । యిందుధరసుందరా నందఘనహార । మందరాచలధీర మహామసంచార । ఈశసర్వేశ జగదీశపరమేశ । పెద్దపులిచర్మంబు మొంపొందునట్టి । రుద్రాక్షమాలికము రూఢిగా వేసి । భస్మంబు లెస్సగా పైనబూసుకొని । వృషభవాహనదేవ నీరాంగళరథ । రంజిల్లు అవనిలో రౌద్రావతార । పెద్దాపురంబులో వెలసియున్నట్టి । చంద్రశేఖర మిమ్ముచాల వేడితిమి ॥ జ ॥ ది ॥

శ్రీవెంకటేశ యాశ్రితరక్షయాశ । దివిజసన్నుతయీశ । దేవతాధీశ । కమలలోచన స్వామి కారుణ్యశీల । విమలసత్కులదేవ విజయసహాయ । కమలాకళత్ర శ్రీకారుణ్యధామ । కరుణించుమమ్ముల నుకవివరదనీవు శరణనివేడితినిచేపట్టినావు । మత్స్యావతారమైమారిజలధిలోను । జొచ్చిసోమకుద్రుంచి సోంపుతోడుతను । దెచ్చివేదము బ్రహ్మకిచ్చితివి మెచ్చి । కూర్మావతారమై కొండపొప్పగాను । గురుతుగానిచ్చితివి

కూర్మరూపసనీవు। అరయంగ దేవతల కమృతంబులొసగి
కర్కశాసురులను ఖండించినావు। కరుణతోఁగాచితివి
కమలాక్ష నీవు। వరహావతారమై వరుస తో డతన॥
ఆహిరణ్యాక్షుకుని అవలీల ద్రుంచి। వరుసగా యా భూమి
యొప్పుట్లుంచి। కామించితివి నీవె కరుణ యూహిం
చి। ఉక్కుస్తంభమునందు నుగ్రమున వెడలి అక్క
సపురక్కసుల అవలీల ద్రుంచి। చక్కగా ప్రహ్లాదు
రవితోఁ గాంచి। నిక్కముగ దాసులను నీవె కృపజూచి।
వామనవేషమున వసరంగ నీవె। భూమి మూడడుగుల
వానగంగ నడిగి। నభము భూమియు రెండడుగులకు
జేసి। భువియును గ్రోచితివి బలి భుజగేంద్రశయన।
పరశురాముడవయ్యి పరగంగ నీవు। అరసి రాజులనె
ల్ల అవనిలో గొట్టి అవని భూసురులకు లతివేడ్కనొసగి।
అవలీల జన్ములను అదురను మ పొగడ। దశకంఠు నణచి
తివి దనుజసంహార। బలరాము డను పేర బరగ జన్మిం
చి। బలభీష్మ క్రోధులను బవరమున జెలగి। బుద్ధరూ
పము దాల్చి పురములను నిల్చి। వద్దికానతులతో వ్ర
తములను చెలగి ముద్దియ్యాన త్రిశివి ముఖవాలతోదురను
కలికిరూపము తాల్చి కరివరద నీవు। కలియుగంబెల్లను
గాచితిక్షిరంధి। వాసిగ దశావతారంబుల వినిన।
భాషిల్లు సిరులకు భాగ్యంబుగల్గు ॥ జ ॥ డి ॥

అంకించి పుంగవం జానవాలంధ్ని ఆంజనేయుల
వాయు ఉగ్రుడై దాటి । లంక కావలియున్న లంకిణి నధ్రిం
చి । లంకంతశోధించి లలన పాదగాంచి । తక్షణం రామ
ముద్రిక చేతికిచ్చి । శంకయును లేకుండ లంకంతగా
ల్చి । లంకలోయున్నట్టి రాక్షసుల గుంచి । లంకద
హనం బెల్ల లఘువున దాటి । ఝూంకారమున రామస
న్నిధికివచ్చి । యిపుడు సేనను గొట్టి యినసుతుని నే
డ్క । శ్రీశరుశినాయకా శ్రీ రాఘిశయన । దానవసం
హార దశరథకుమార । నీలమేఘశ్యామ ఖిలలోకేశ ।
మావిన్నపంబొకటి వినరయ్య మీరు । హనుమంత
జాంబవంతపుడు సుగ్రీవు । వారధిగట్టి యావతిలంక
జేరి । రావణాసురుగొట్టి రాక్షసులమట్టి । అవుడు విభీ
షణుని ఆలంక వేడ్క । పట్నంబు గట్టించి భాసురంబు
గను । అపుడు అయోధ్యకును జనుదెంచి మీరు పట్టా
భిషిక్తులై పదునొకంబేండ్లు । రాజ్యాంబు పాలించు రామ
చంద్రుండు । జ ॥ ది ॥

వినరయ్య జెప్పెదను విశదంబుగాను । మా
యిళ్ళలో మేము చిన్న బాలురము । అదునునుంత
గా (అయ్యవారు) అరుదెంచి తల్లి, దండ్రులను గను
గొని తగవిచారించి మాకు విద్యలు చెప్ప మన్మధుం
డోడ: । వాటెంచి తెస్తిరి పంతులను నిల్పి । మము చ

దేవ నంపిరి మాతల్లిదండ్రి । అది మొదలుగా మేము
చదువుకోగాను । చదువుచెప్పినమాకు చాలునాయింత
రాజిల్లు యామహోర్ణవమికిని మేము । యాచింపవచ్చి
తిమి పండుగకు మేము । భటువాక్యధర్మములంబరగం
నగూర్చి । హరిహరబ్రహ్మలకు అరుమగానుంచి । ని
లువు జీతముగాదునిలచిమిమ్మనుగ । వాదాలు గావ
య్యతెలియవిసరయ్య । యింత చక్కని విభుండింటిలో
నెవరు, భామరో మన మెంతభాగ్యవంతులము యింత
శృంగారముగ వీన్ని జూచితిమి ॥ జ ॥ ది ॥

శ్రీజానకీరమణ శ్రితమనోల్లాస వరభక్తమం
దార వార్ధిగంభీరనీదివ్యచరితమున నియతులైనట్టిజనుల
కారోగ్యముజయములను మరియువిహితవాంఛితముల
నువిడువకను నెపుడు కల్గివర్ధిల్లెదరు కలియుగమునందు
జయజయానీకీర్తిసంకీర్తనకునుజయజయానీపుణ్యచరి
తంబులకునునీదుపూర్వమునందు నిఖిలమునజనులఁగాచి
రక్షించుటకుకరుణతోడుతను బ్రహ్మతపమును మెచ్చిప్రే
మమీరగను ధరనుదశరథరాజులసయులైపుట్టితపసివెం
టనునేగితాటకిని దునిమి తపమునురక్షించిధైర్యమొద
వంగహరువిల్లు విరచి హర్షమున చెలగి జానకిని పెం
డ్లాడిజయముసేవించి పరశురామునిభంగపరచివేగమున
అనుజసహితముగాగ నవనిజనుగూడి కైకవరమునచేసి

కానలకునేగి మారీచుమదిరించి మహిమ వెలయగను
అవనిజనుగానకను నచట వెదకుచును వాయుపుత్రుని
గాంచి వాలినివధించి రవిసూను సఖ్యంబు రమ్యము
గజేసి అంజనేయుల బంచి అవనిజను దలచి వనజరా
శినెల్ల వార్ధిబంధించి రాక్షసావళినెల్ల వసమందు గూ
ల్చి దశకంఠశిరములను ధరగూలనేసి జానకినిచేపట్టి
చెలగుచునువేగ అయోధ్యకువచ్చి యాత్మణము
నందు రాజ్యభారముదీర్చి రమణితో సుతను అభయంబు
లిచ్చితివి ఆశ్రితకదంబధరను పెద్దాపురీపురవరమునందు
కరుణ సంతార్యసుత వరజగన్నాథ గురుమదిని చెలగు
చును కోర్కెలొసగుచును వెలసితివి లోకమున విఖ్యా
తిగాను చెలగుచునమమునేలు శ్రీసీతరామా॥ జ ॥ ధి

ఉత్తమా జనులార చిత్తగించండి సభలోనను
న్నట్టి సర్వజ్ఞులార పదిమంది బాలురము బాగుగా మే
ము విన్నపము చేసెదము వినుడి మామాట వి దెప్పించిక
ట్నంబు లిప్పించరయ్య యిప్పుడే లేదనక యివ్వలేమన
క అప్పువాళ్ళముగాము ఆలస్యముంచ ఆలస్యముంచకు
డియూ కలవుతుంది యాకళ్ళచేత మీవాకిళ్ళలోనునుం
చుట యిది మీకు మంచిపనిగాదు పాతహపాయిలు
పదవుమాకిపుడు సంకత్తుటంకముల్ వద్దమామాకు క్రొ
త్తగా నేక్రొత్త లెత్తగలవైతే చెల్లవచ్చునటంచు

చెప్పచున్నాము ॥ జ ॥ ది ॥

చెలువైన చెవికమ్మ చన్ద్రహారములు ముడి ఉంగరంబులు ముద్దుటుంగరము వచ్చలపోగుంపిచెలుక తాళిలు బొమ్మంచుపంచలను బాగైనపాగ ...లతారు వ్రాణీలు జాలురుమాళ్లు అంగీలునడకట్లు అమరునాన గలు తొడిగితిమి ముస్తాబుతోటి గిలకలను ॥ జ ॥ ది ॥

కటకటా మీకెంత కరుణలేదయ్యా। యిటువచ్చి యడుగ మాకిదిపద్ధతయ్యా। మాటల కేమి మా పాట వినరయ్యా। పాటల సుధారసముపలుకు వినరయ్యా। పాటముగ దీవించ వచ్చితిమిగదయ్యా। యేటేటమాకిది యిహపరంబయ్యా। మాటగట్టుట యేమి మోసము గదయ్యా। కోటికార్జించిన కూటికేగదయ్యా। మటు మాయవాదులను మటియడగమయ్యా। నీటుగల శాల్జోము నేడివ్వరయ్యా। సాటెవరు మీతోను సరసము గదయ్యా ॥ జ ॥ ది ॥

శ్రీమహితపెద్దాపురీ మహానగర। వామభాగస్థదేవాలయ విభాసిత నిరత సజ్జనపోష నిత్యసంతోషి। సరసవాగ్ధనభాసిదురితయశోషి। అరుణపల్లవపాణితను తాభ్రవేణి। వరసైకతశ్రోణివాగ్విజితవాణి। శూలిసతిచారిత్రశుభగలితగాత్ర మరిడిమహాలక్ష్మమ్మ నేలూతల్లికరుణతో మాదుగురువి రక్షించు ॥ జ ॥ ది

లోయి రవ్వలెచ్చెదవు మంతనంబులుశాయ మఱిగినా
వటుక యింతవాదవుట సేనెయగ నెన్నడును తాళరాని
విషంబు తరువాత నిన్ను బాలులాదరుగూడి బట్టి తె
చ్చెదరు ముద్దుల్లుగజ్జెల్లు ముద్దుగుల్కెడవు బువ్వతిన
కుండను బూచులకునిస్తు । అద్దంబులో పావ లతిసే
ద్కతోను । సిద్ధంబు నీమాటచెప్పనాతోను మేజాప
తిరిగెదవు రేజాడపోదు నీజాడయెవరికిని తెలియంగ
రాదు కానికానిశేళ కళ్ళకగుపదవు కలగోళ్ళతో నిన్ను
శిక్షింపకుంటె చెల్లునా నాపేరుగొల్లయశోద॥ జ॥ ది॥

రాజాధిరాజరామా రాజమార్తాండ వినవయ్యా
మామనవి వివరంబుగాను ఘనులనివినిమిమ్ము ఘనత
రంబుగను విని బాలకుల ముముబడలంగ లేము ఊరూరు
దిరుగంగనోపికలు లేవు మీధర్మమునుగోరి మేము వచ్చి
తిమి మీతో టిసాటివరుభూతలంబునను కోటిసూర్యుల
తోటి సాటిమీమోము సజ్జనులు మెచ్చి సభలందుమి
మ్ము విప్రజనపోషకా వినరయ్యా యీ రాజమహారా
జ రమ్యచాత్రిత చేపట్టి మామనవి చిత్తమందుంచి శ
లవుగా సధూలాలను చేరంగదీసి కాదనక లేదనక ఘన
ముగా నాచి పన్నీరుగంధంబు బాగుగాబూసి తంపు
టాకులుమంచి పండుపోకలును అయ్యవారికి చాలు
అయిదువరహాలు తెప్పించి కట్నంబులిప్పించవలెను

మాపప్పాబెల్లాలుమాకుదయచేసి శ్రీభుకుగవంపుకె
శ్రీమంతులారా॥ జయావిజయీభవదిగ్విజయీ॥

సీ. పార్వతీపతితెల్పు పాలసంద్రము తెల్పు కామ ధేనువు తెల్పు కంచు తెల్పు। నారదముని తెల్పు నందీశ్వరుడు తెల్పు శారదాపతి తెల్పు శంఖు తెల్పు। ఐరావతము తెల్పు నాదిశేషుడు తెల్పు హాళాయుధుడు తెల్పు హంస తెల్పు। కల్పవృక్షము తెల్పు కల్పఖండము తెల్పు మల్లిపుష్పము తెల్పు మంచు తెల్పు। తెల్పు జెప్పగనేల తెరవకు మేలైన గుణముగల్గు నేమో కోటిశాయి॥ ౧౭

సీ. అరుణోదయం బెరుపు అరుణాచలం బెరుపు అర్క-మండల మెఱుపు అగ్ని మెఱుపు। బ్రహ్మాదేవుండెఱుపు బంగారు కరంబెఱుపు ఫణిఫణాలు మెఱుపు పద్మ మెఱుపు। పద్మరాగం బెఱుపు పగడంపుతీగెఱుపు కుందనపుచాయ మెఱుపు కుంకుమెఱుపు। మంకెనపు మెఱుపు మరిదొండ పండెఱుపు ఆసముద్రపు రుగెఱుపు అతివ మెఱుపు, మెఱుపు జెప్పగనేల నింతికి మేలైన గుణముగల్గు నేమో కోటిశాయి॥ ౧౮

సీ. ఇంద్రాచలమునల్పు యింద్రవజ్రమునల్పు యింద్రనీలమునల్పు యమునునల్పు కృష్ణదేవుడునల్పు కోకిలంబులునల్పు నయినదృష్టులునల్పు సరుకునల్పు సామ

సీ. గర్వమెంచకురోరి గడుసుగాడిదికొడుక వంశా
న్ని నీబుఱ్ఱకొసివేయ బ్రహ్మదేవుడు నిన్నుబండిమండల
కెయ్య మహాలదేవుడు నీదు ముక్కుచెక్క అడి
విలోపెద్దపులి అబ్బెమ్రింగివెయ్యకోటగుమ్మాని నీశిరసు
కొట్టివెయ్య మళ్ళివస్తేను నీమచ్చమాపుతాను నిమ్మ
కాయలమ్ముస్త్రీ నీయాలిముండ మొయ్య॥

—♦ రూకపద్యం ♦—

శ్రీవనితామోద క్షితియశోజాల వినుతాబ్ధిచం
దారవిజయశ్రీలోల సంగీతసాహిత్య సద్గుణవిశాల అల
విక్రమార్కసాహసగుణవిశాల వినరయ్య లుబ్ధమాన
వులపద్ధతులు వినుపించెదము లోకవిఖ్యాతిగాను శలవి
య్యుడీ మాకుసర్వజనులారా లోభులత్యాగములు
లోకమంతలను వెలయంగజెప్పెదము ఈదశమికిప్పుడు
మొక్కడవచ్చెను యీమహార్ణవమి యిప్పుడేటికివచ్చె
యీవిజయదశమి అప్పుడేమొరుగుంచె అమ్మాలయిం
ట్లో ఒప్పుగా దాగొందు నోరుమెదుగకుండ చప్పుడా
మొనుగదాసరనంబుదప్ప పొరుగూరికైననుపోనేరనైతి
నడిమివాకిటకల్లు గెడవెయ్యనైతి దొడ్డిమిందరగోడ
నుమికిపోనైతి దిట్టముగ గాదిలోదిగియుండనైతి అమ
దాలగంపలో అణగుండనైతి పొనకచాటునవైన పొం
చుండనైతి దూదిబుట్టలలోను దూరుండనైతి బందరు

శ్రీలైన పారిపోనైతి చెన్నపట్టంబైనచేరుకొనైతిఢిల్లికో టకునైనవెళ్ళిపోనైతియేల్నాటిశని చేతియింతపనిపొసగె కర్రపుల్లలుచూచి ఘల్లుఘల్లునుచూచి ముంజేతిగం ధంబు మురుగులను జూచి ముద్దుమోములు జూచిము త్యములుజూచి వన్నెకోకలుజూచి చిన్నిజెడజూచి వె ర్రినై చిక్కితిని యీగడియలోను ఓతల్లి పోలేరుఓసో మలమ్మ ఎల్లారియామాత యెక్కళ్ళదేవి యెక్క ళ్ళదేవికి బక్కచేంబోతు పంబనాళ్ళకుదెస్తు వరుస జేయింతు మాతకుపుట్టంబు మానికాదెస్తు పోలేరు తల్లికి బోనాముపోతు కల్లుకుండలునిస్తు నెల్లారికిపుమ గ్రామదేవతకిస్తు ఘనయేటపోతు కోడిపిల్లనుగోతు కూవలమ్మకును గండదేవతలైన కాపాడరైరి గండసేవ లుజేతు గడుపుకీవిన్నెని సూర్యుడా నాకొక్క నమకూ ర్చితేను పోలెడుగోధుమ్ములు సొంపుగానిత్తు చంద్రుడా నాకొక్కసమకూర్చితేను గోణెడుబియ్యంబు కోసర కనునిస్తు అంగారకుడు నన్ను ఆదరిస్తేను అడ్డెడుకంది లుకొని అర్పింతునీకు బుధుడు నాకీబాధ పోగొట్టితే ను సోలెడు పెసలు సొంపుతో నిస్తు గురుడునాకీబాధ పోగొట్టితేను చారెడుశనగలుకోరియిచ్చెదను శుక్రుడా యీబాధ తీసిచేస్తేనుపిడికెడుబొబ్బలుజా పిలిచియిచ్చె దను శనిరాహుకేతువులు చిత్తగిస్తేను నువ్వులుమిను ములు పులవలిచ్చెదను చేసినదానాలు చెప్పబనిలేదు చెయ్యవికగజేస్తిని చిత్రిదానాలు దోసెముగింజలో మాములో బోసి బ్రహ్మపిద్వాంసులకు భట్రాజులకు

నుపటుశాస్త్ర [illegible]యినసంపన్నులకును చేస్తినిదానాలు
చెప్పబనిలేదు యీకొంటివాళ్ళంతయిప్పుడేవచ్చి తమ
రూక తెమ్మనుచు ధాటుచేసేరు ఈరూక నేనిచ్చినట్లో
వ్వగలను కూరదినికాయదినికూర్చితినిరూక కూలినాలీ
చేసి కూర్చితినిరూక దానధర్మములేక దాచితినిరూక
తాతలనాటిదంతపుభరణిలోను దాచితినిగదనిన్ను ధన
ధాన్యరూక యీరూక కొనిపోయి యేలూరిలోను
ఆకులుదెచ్చితె ఆకెన్నెల్లుగడచు తాళ్ళూరిసంతలో తల
గుడ్డకొంటెపలాగుగట్టినా ఏడాదిగడచు నయముగా
దాచితిని నాచిట్టిరూక పోకుమీ చిన్నారిపొన్నారి
రూక నీళ్ళచిమ్ముడదొరికితి ఒక్క రూక పొలములో
నైనను పొంచుండనైతి నినువదలి ప్రాణముల్ నిమిష
మెట్టోర్తు ఈలోకములకెల్ల హెచ్చయినరూక పదహారు
దుగలాలు బంగారురూక మెనిమిదిచౌలాలు హెచ్చ
యినరూక పాతికలు నాల్గయిన పరగంగ రూక అడ్డి
గెలు రెండైనలమరంగరూకబీరపువ్వన్న హేస్రియమొ
పు రూకనినువదలిప్రాణములునిమిషమెట్లోర్తునాగోచి
కొంగునగట్టికొన్నాళ్ళుదాస్తి గరణంబునకైనను ఘనతగ
లరూక లంచమిచ్చినగాని రక్షించురూక మావాళ్ళు
మరినాళ్ళు మాచెడ్డవాళ్ళు కూస్తవిన్నారంటే కొట్టి
బొయ్యేరు కరికుక్కవచ్చేకగచిపొయ్యేను అని యిట్లు
పల్కుదురు అతిలోభిజనులు ఆలాటివాండ్లను మేమడి
గేదిలేదు మీరుసర్వజ్ఞులు బాగలవారు మనమునకొ
నరక అనుమానపడక గొప్పగాకట్నంబు లిప్పించ

వల్లైను॥ ఢ॥ ధి॥

పరగనాశ్వీజశుక్లపక్షంబునందు తెరగొప్పకీపిం
చవ స్త్రీమిటు మేము శ్రీరస్తువిజయోస్తు దీర్ఘాయురస్తు
ధనకనకవస్తు వాహనసిద్ధిరస్తు గారుణ్యాముగ మీకు
కళ్యాణమస్తు ఆశ్వీజశుద్ధమహార్నవమి రాగానే బాగు
గాదీవించ వస్త్రి మీట మేము బాలకుల దీవెనలు బ్ర
హ్మాదీవెనలు చాలసంతోషులై సరసులయ్యేదరు శ్రీమం
తులై మహాక్షేత్రములుగల్గి భూమిలో పల్లెనిభోగము
లుగల్గి గజములును అశ్వములును కమవేట్లగల్గి సుజన
సంభాషణలు చోద్యములుగల్గి ధన ధాన్యములుగల్గి కర్మ
ములుగల్గి అనువులతో పాటలును చాలగల్గి కరము వర్ధి
ల్లుచు పుణ్యములుగల్గి నవరత్నసంపదలు నాయకముగల్గి
బహుకీర్తి సంపదలు జయంగగల్గి తనయులు తనయు
లకు తనయులనుగల్గి మనమలకు మనమలకు మనమలను
గల్గి కొడుకులకు కోడండ్రు కొమ్మరొప్పగల్గి సుతులతో
హితులతో శోభనముగల్గి వడుగులను పెండ్లిండ్లు వరుస
తోగల్గి యేడాది కొకదినము వేడుకతో మేము పొడి
మిగ మిమ్మిట్లు పొగడవచ్చెదము గంధాక్షతలిడ్చి క
ట్నంబులిచ్చి విందుబియ్యము పప్పు విడియంబులిచ్చి
పొందుగా నెయ్యిచ్చిభోంచెయ్య [illegible]చు అందముగ
అయ్యావారిని అనుపు డింటికిని అయ్యగారొచ్చెనని అ
నుమానపడక నయగారిమాటలనినగుచుపొమ్మనక రే
పురా మాపురామళ్ళీరమ్మనక కోపంబు శాయక కో
లము లేక జాగుచూపులు మాదిచాలుపొమ్మనకయీ

సాగిపోమ్మనక తిరిగితమ్మునక వరుసతో సూర్యాంబుల
రెండరనక కోరగానివారంచు కోపంబు తీర కటకటా
చేతిసొమ్ములువదలనక యీసారితప్పిపోయివ్వలేమన
కయింత సేపుంచుమురా యింతదయలేక పలుమారుమి
మ్మువుదు అడుగంగ రాముదాళ్ళయినగరగించిరా కోరగ
లము అల్లుండ్లవలెగాదు చెలగిమిమ్మడుగ మంత్రతం
త్రముగాదు మాయచేనడుగ బలవంతము గాదు బలి
మిచే నడుగ యింద్రజాలము గాదు భ్రమయించి
యడుగ మహేంద్రజాలము గాదు మరిమరి యడుగ
సొగసువిద్యలు గావు సాక్షించియడుగ నిలువుజీతము
గాదు నిలచి మిమ్మడుగ పాతఅప్పులు గావు పలు
మారులడుగ కొత్తఅప్పులు గావు కోరి మిమ్మడుగ
ఖ్యాతిగమాస్తైకీఘనకీర్తియగును యివ్వని లోభివారిం
డ్లకుబోము వెయ్యారు లేవైన వేడేది లేదు అయ్యవారికి
చాలు అయిదువరహాలుపిల్లవాళ్ళకు చాలు పప్పు బె
ల్లాలు పన్నుగా కర్జూరపండ్లక్క శేరుపట్టుపచ్చడమిచ్చి
పదివరహాల లిచ్చికట్టెశాల్వాలిచ్చి కడియంబులిచ్చియిష్ట
ముగ అయ్యవార్ని వీడ్కొల్పదగును తెచ్చింపుడో కశా
ల్వా తెలివిరంజిల్ల యిప్పించి పంపుడీ యింతసిల్లు
శీఘ్రముగ పంపుకీ శ్రీమంతులారా॥ జ ॥ ది ॥

మరుజనక మత్స్యము మత్స్యావతార । గురు
తుగా కృపజూడు కూర్మావతార । వరదుడవు గదవ
య్య వరహావతార । సిరులుకిరుశించు నరసింహావ
తార । వటుమున సిరిగల్లు వామనావతార । —తే.

సాంతక రఘురామావతార । రక్షించు మము పరశు రామావతార । పక్షివాహన బలభద్రావతార । బ్రో వనేర్చినయట్టిబుద్ధావతార। కావవేమమువేట్క కలికావ తార । దినముసంపదలొసగిదివ్యావతార । ఘనరాజగో పాల కరుణావతార జయాభిజయభవ దిగ్విజయభవ ॥

బంగారు జలతారు రంగైనపాగ । ముత్యాల పోగులు ముద్దుటుంగరము । చేతికంకణ బిరుదుచంద్ర హారములు । నిలువుటంగీలు నీలాపమణులు గోమే ధికాపుష్ప గోలుసురత్నములు మాణిక్యము కిరీట మహితప్రతాప । అయ్యవారికి చాలు అయిదువరహా లు । చిన్న వాళ్ళకు చాలుచిరిశనగపప్పు పిల్లవాళ్ళ కు చాలు పప్పుబెల్లాలు॥ జ ॥ ది ।

పదయా మీదయా మామీదలేదు । యింత సేపుండుట యిదిమీకు తగునా । దసరాకు వస్తిమని విసవిసలపడక । చేతిలోలేదని అప్పివ్వరనక । రేపురా మాపురా మళ్ళిరమ్మనక । యిప్పుడేలేదనక యివ్వాలే మనక । యిరుగుపొరుగులువారుయిస్తారుసుమ్మి। గొప్ప గామాకండీ తప్పకనుమీకు । పావలాబేడైతె పట్టేది లేదు । అర్ధరూపాయైతె అంటేదిలేదు । ముప్పావలి స్తేను ముట్టేదిలేదు । హెచ్చురూపాయిస్తెపుచ్చుకుం టాము । పైపావలా మాకుపప్పుబెల్లాలు । శీఘ్రమే పంపుడీ (శ్రీ)మంతులారా॥ జ ॥ ది ॥